

ఆనంది తన స్నేహితురాలు సరయూ కోసం

బుట్టలో ఏడు రకాల పళ్లు పెట్టుకుంది.







వాటిని చూసి తన స్నేహితురాలు సరయూ ఆశ్చర్యపోతుందని

అనుకుంటూ వాళ్ల ఊరికి బయలుదేరింది ఆనంది.



వీటిలో ఏ పండుని సరయూ ఎక్కువ ఇష్టపడుతుందో?



పసుపు పచ్చటి అరటి పండుని ఇష్టపడుతుందేమో...



...లేక తియ్యటి జామ పండునా?



గుండ్రటి, తియ్యని నారింజ పండుని ఇష్టపడుతుందా...



...లేక బంగినపల్లి మామిడి పండునా?



తియ్యటి రసం కారే అనాస పండుని ఇష్ట పడుతుందా...



...లేక మెత్తగా ఉండే అవకాడో పండునా?



...లేక ప్యాషన్ పండుని ఇష్టపడుతుందా?



ఆమె ఏ పండుని ఇష్టపడుతుందో?



“హాయ్, సరయూ," ఆనంది పలకరించింది. “నీకు ఏం తెచ్చానో చెప్పుకో.”

సరయూని ఆశ్చర్యపరచాలని ఆనంది అనుకుంది.



“చిట్టి బత్తాయిలు!" సరయూ అంది. “ఈ పళ్లంటే నాకు ఎంతో ఇష్టం!"

“చిట్టి బత్తాయిలా!" ఆశ్చర్యపోవటం ఆనంది వంతు అయ్యింది,

“ఇవి ఎలా వచ్చాయో నాకు కూడా తెలియదు!"



కోతి
monkey
ostrich
నిప్పు కోడి
చారల గుర్రం
zebra
elephant
ఏనుగు
జిరాఫి
giraffe
antelope
జింక
చిలక
parrot
goat
మేక

తన స్నేహితురాలు

సరయూ కోసం ఆనంది

ఒక బుట్టలో ఏడు రకాల

పళ్లు తీసుకుని వాళ్ల

ఊరికి బయలు దేరింది.

దారిలో ఆనంది ఒక

అడవి గుండా వెళ్లాలి.

అడవిలోని

జంతువులకు కూడా ఆ

పళ్లు నచ్చాయి!

